ఓం "గం" గణాధిపతయే నమ:

# సర్వమంగళా

22/10/10

ఉ. శ్రీకరమౌనునీపదముచింతలుదూరమునౌనుతల్వగ
న్నాకరమౌనుసంపదకునాయుషుపెంచునువిద్యనిచ్చు వే
చేకురుసర్వసౌఖ్యములుచేతికివచ్చునుకామ్యమంతయున్
మూకకుమాటలొచ్చుమరిమూలపుటమ్మవె సర్వమంగళా 1

ఉ. జన్మనొసంగినావు భువి చాలగ కాలమునుంచినావు నా
సన్మతి మెచ్చి సొచ్చిశివు సంగతి గూర్చుము సౌఖ్యసంపదన్
మన్మతి నీదు పాదముల మంగళరూపమునందు లగ్నమై
జన్మలనెత్తకుండగను జాగృతి నిమ్మిక సర్వమంగళా 2

ఉ. బందుగులన్నమాటలవి బాధలు గల్గగ చేయునెప్డు రా
బందులు వారపేక్షగల బాటలు మూసుకుపోయెమాకు నీ
వెందున జూడయండగని యెప్పుడునుండగ రమ్మనందు మా
బంధువునీవె మాజనుల భాగ్యపు పంటవు సర్వమంగళా 3

ఉ. మానసమందునీజపము మానను సత్యము పల్కజేయవే
చానలమీదమోజుగల జాడలు నాలొకలంగ నీకుమా
కూనలు చిన్నవారు మతికూడను మిక్కిలి చిన్నచూడగన్
కానగలేరు నీమహిమ కావవె మమ్ముల సర్వమంగళా 4

ఉ. జీవుల రాకపోకలను చిక్కులు జీల్చుచు యాటలాడుదో
పావులవోలె మమ్ములను భావన చేతువె మానసంబునన్
తావులు మార్పుజేసి వరతావులవేవియొ చూసిపంపుదో
గోవులపాలనా విధము గోచరమాయెను సర్వమంగళా 5

ఉ. నాకువరంబునీయవె యనంగునిబాణహతుండగాక నే
యాకటికెప్పుడున్నితరులన్చెయి జాపకనుండునట్లుగా
కాకలుదీరునట్లుగను కాయముజేయుము దుష్టశిక్షణీ
లోకమునున్నకాలమునలోపముచేయకు సర్వమంగళా 6

ఉ. ఏనునిమిత్తమాత్రుడను నీకరుణేనను నిల్పగానిలన్
గానగజేసెవింతలను కావవెవాక్కుసదర్థభావమున్
సోనలు జాలువారరససూక్తులు పల్కగజేయుమమ్మ నా
మానసమందుసల్పుమికమంజులభాషణసర్వమంగళా 7

ఉ. రమ్మనిబిల్చి నామనపురాపిడిదీర్చగ జ్ఞానమిమ్ము నీ
యిమ్మునయుండనిమ్ము చిత్కళకానగనిమ్ముచిన్మయీ
నెమ్మల బాధతీర్చుమిక నిర్మలమానస సంయమీ శివా
సొమ్ములు పొందచోద్యముగచూచుచునుందువె సర్వమంగళా 8

ఉ. అర్భకుడేమొశక్తి గలవాడుగమారును,మూగమాటలా
డార్భటితోడ నీదయనుడాయదుమృత్యువుకూడధైర్యమున్
బర్బరుడైనగాని నినుభక్తినగొల్చిన మోక్షమిత్తువే
దర్భపవిత్రమౌ రససుధానిధి నీకృప దుర్వమంగళా 9

ఉ. మామిడిజామనాసరటి మాగినఖర్జురపండులన్నియున్
ఆమధురంపురుచ్యములు నాలుకయేయెరుగున్వచింపరా
దే మనమందెయున్ననుయదేమివిచిత్రమొ నీదుప్రేమలో
నేమనుచుండుభాగ్యమిది యెట్లువచింతును సర్వమంగళా 10

ఉ. మంత్రమునేర్వలేదు నిజమంతయుచెప్పుచునుంటినమ్మయే
యంత్రమువ్రాయరాదసలు యజ్ఞముచేయగరాదునాకు సా
యంత్రపువేళలందు నినునర్చనచేయుదు బుద్ధిపుట్ట స
న్మంత్రము నీదునామమననంబని యెంచితి సర్వమంగళా 11

ఉ. కేలునుబట్టినన్నుపరికించి చరింపగజేయుమమ్మ నే
పాలునునీటిభేదమదిపాఱమెరుంగను విద్యలేదు లో
పాలనుదీర్చి అందరుశభాసని మెచ్చుచుహ-యిగూర్చగా
చాలిన శక్తినిమ్ము మరుజన్మములేకను సర్వమంగళా 12

ఉ. యాచనచేతగాదు మరియాదనునెన్నడు వీడలేను సా
లోచనబూని నీకరుణలోననుతన్పుచునుండుమమ్మయా
లోచనయందు గౌరములుప్పతిలంగనుచేయుమమ్మ చే
సాచికనెవ్వరిన్నడుగశాంతినిగూర్చుము సర్వమంగళా 13

ఉ. లోకులు యెన్నిమారులిట లోకువజేసియుమాటలాడగా
బాకులుగుచ్చినట్లుపెనుబాధలుపొందితి భార్గవీసదా
నాకుసభాంతరాళముననండగనిల్వుము పిల్చినంతనే
సాకులుచెప్పకుండపలుసాధనలీయుము సర్వమంగళా 14

ఉ. నీదరహ-సబాసరుచి నీరజనాయకదీప్తియైచనెన్
సాదరపూర్వకంబగు సౌమ్యసుహ-సవికాసకాంతులై
సోదరజీవులన్నిటుల శోభలుచిమ్మెనుసృష్టియంతటన్
ఆదరణీయరూపమునదర్శనమీయుము సర్వమంగళా 15

ఉ. జన్మమునెత్తినాడ పలుఛాయలలోకముజూచినాడనో
మన్మథబాణఘాతులగు మౌనులమాన్యతగాంచినాడనే
నిన్మదినమ్మియుండియిల సౌఖ్యముపొందెదశాశ్వతమ్ముగా
మున్మనునికుమొ్రక్కెదను మోక్షమునీయుముసర్వమంగళా 16

ఉ. సర్వమునీవశంబయని సొంతమునమ్మితినామనంబున
న్నుర్వినితో్రసినావు మదినోర్పువహించి భరించినాను నా
గర్వము సర్వమునాశమయె కామునిబో్రచినచిన్మయీసదా
శర్వునియర్ధభాగమగు శాంభవి కావవె సర్వమంగళా 17

ఉ. మర్మమునీవెచూడగలమానినివమ్మ పరాకులేక నే
ధర్మముతప్పకుండపరతత్వమెఱింగచరింపజేసి ఏ
కర్మలలోనగాని ననుగాసిలజేయకు జీవితాన యీ
శర్మనిపుణ్యకర్మునియశక్తుని మర్వకు సర్వమంగళా 18

ఉ. కానగరావెతల్లి శతకల్పకవల్లి సుధామవల్లి మా
జ్ఞానముపెంచుమమ్మమదినజ్ఞతదూరముచేయుమమ్మనా
ధ్యానమునందునేయితర ధ్యాసలులేకనుశాసనమ్మునీ
మానవజీవితాన పరిమాణముపెంచుము సర్వమంగళా 19

ఉ. నీకనులజ్జనించు కిరణీకృత పాశముచేత జీవులున్
ఆకలిదప్పికల్ మరపు మత్సర మాయలమున్గి తేలుచున్
వే కనలేరుమానవులు విద్యలవింతలతల్లివీవె మా
కేకొరతింతలేక నిలక్షేమము నీయుము  సర్వమంగళా 20

ఉ. నీకరుణామృతాంబుధిన నిత్యముస్నానముచేయనిమ్ము నీ
ప్రాకటదివ్యతేజమది పావనమార్గముచూపనిమ్ము శ్యా
మా కమలాసనాది సురమానసపూజిత మంత్రరూపిణీ
కైకొనిమాదుపూజలనుకావుమునెప్పుడుసర్వమంగళా 21

ఉ. ఆ కమలాసనాది సురస్వాములయందలి  శక్తి నీవెగా
దా కరకంఠకంఠ సుమదామము వేసితివీవుప్రేమతో
నీకరుణాకటాక్షరసనిర్మలతైజసువీక్షరక్ష మా
కేకలదంచునమ్మి నినుకేల్మోడి ఁదల్తును సర్వమంగళా 22

ఉ. ధర్మము తప్పకుండనిక ధారుణియందుననున్ననాళ్ళు నా
కర్మలయందులోపములు కానగరాకను చేయుమమ్మ మా
మర్మమెఱింగి జన్మమునమాయలమున్గకయుండునట్లుగా
భర్మసుకర్మమర్మముల బంధముతెల్పుము సర్వమంగళా 23

ఉ. ఎప్పుడుఏమిచేసితినొ యీమహినీతనువిచ్చినిల్పినా
విప్పుడుబాధపెట్టుటకునీర్ష్యగలట్టిమనుష్యులందునన్
చప్పుడుగాకనెట్టికడుసంతసమొందుచునుంటివేల నా
తప్పులు రూపుమాపిదయతన్పుమునిత్యము సర్వమంగళా 24

ఉ. శాంతమునీదుమోము రససారమునీచిరునవ్వుచిన్మయీ
కాంతులుజిమ్మునీకనులు కర్మలమర్మమెరుంగుకోమలీ
పొంతనలేదు నీపనుల పోల్చగనెవ్వరి శక్తియైన నీ
పంతమునాపయిన్వలదుపాపవిమోచని సర్వమంగళా 25

ఉ. ~~ఈ~~తనువందియుండిటులనీదుచునుంటినిసంసృతిన్సతీ
పాతకమేమొగానరులపాల్బడిబాధలునొందుచుంటినే
కాతరజేయనమ్మపలుగాయపుపోటులుమాన్విరక్షణీ
యాతలరాతమార్చగలయీడితదేవివె సర్వమంగళా 26

ఉ. లోచనగోచరంబయినలోకమదొక్కనిమేషమేయగు
న్వాచనకోటిరెట్లురసవాహినిలుకెరుంగురుచ్యమా
లోచనయందెనిల్చువరలున్నిలదేహముశాశ్వతంబగే
పాచికలాటయేల?వసుపాలిని పోషిణి సర్వమంగళా 27

ఉ. విద్యలమూలశక్తిపరవిద్యలనాదిమశక్తి లోకము
న్చోద్యత మిథ్యగాతలచుచోదనశక్తివిరక్తిరక్తుల
న్నుద్యతనాపుశక్తిబహుయూహలమించినశక్తిమృత్యువు
న్నాద్యతనాపుశక్తిశివనృత్యపుసాక్షివి సర్వమంగళా 28

ఉ. సారములేనియీజగతిసంకటమాయెనునాకొసంగు సం
సారమునుండిముక్తి యవిచారమునిర్మలకర్మమర్మ ధీ
సారమునీపదాబ్జరససారముజన్మలవిజ్ఞసారమున్
పారముముట్టగాజనని భాగ్యవిధాయిని సర్వమంగళా 29

ఉ. తీరముచేరలేకపలుతీరులయత్నముచేయుచుంటి నా
భారమునీదికాదెపరిపాకమునొందగకర్మలందు మే
లారయనార్తితోడనిను లక్షలమారులు పిల్చినాను సం
సారమునందునున్నబహుసాధనబాసల సర్వమంగళా 30

చ. అరమరలేకనిన్నెనిరతంబునునర్చనజేసికాయజా
రిరమణిసిద్ధసాధ్యులుధరింత్రులనీదుపదాబ్జరేణువుల్
శిరమునకామదాయినివచింపభవాదృశలీల శక్యమే?
కరుణరసార్ద్రభావినిసుగాత్రవిలాసినిసర్వమంగళా 31

ఉ. దేహమునందునుండిటుల తీవ్రములైనవిషాదమోదముల్
మోహముచేతపొందియిటమూర్ఖజనంబులమధ్యనుండి సం
దేహముతోడ యుంటితనుదేహళిదాటగనీదుపాద సం
వాహనమాజ్ఞయిత్తువని వాంఛతొనుంటిని సర్వమంగళా 32

ఉ. పర్వతరాజపుత్రివయి భాగ్యముయోగ్యమునిచ్చినావుయా
శర్వునిపాణిబట్టియనిశంబలశంభుని యర్ధదేహివై
సర్వమునీవెటింగిఫలసారముపారముముట్టనిచ్చి యా
సర్వులతత్త్వమెర్గితివి శాసనమిస్తివి సర్వమంగళా 33

ఉ. నీకనులజ్జనించుకిరణీకృతచిన్మయశోభనాంశువుల్
సోకగనిమ్ముమమ్ములనుసోమకళాధరిసౌమ్యసౌహృదీ
తాకిననీదుచూపులనుతాకగరోగముదేహమందునన్
యోకమనీయభాషిణి సుసౌఖ్యవిదాయినిసర్వమంగళా 34

ఉ. నీపద కింకిణీ రవళి నిర్మల మానస సారరాజమై
కాపరియై కళై సుఫలకామ్యవిధాయకమై పటీరమై
నీపసుపుష్పరాగమయినిస్తులమైఘనసారమైఝరై
తాపముతీర్చుతాపసులతన్త్రులుమీటుచు సర్వమంగళా 35

చ. కుసుమలతానికుంజములకోమలరాగపరాగపూతమై
కిసలయరాగరంజితవికీర్ణవిభావవిభూతిభాషయై
రసభరితంబునైమృదుసరాగమరాళవిలాస సారమై
వసిగొనినాహృదంతరులవర్తిలెకింకిణిసర్వమంగళా 36

చ. సుమభరితామృతావృతయశోవిలసద్వరనైక భావమై
విమలలయాన్వితాతపనవీవనయైరసయోగశబ్దమై
కమలజపాదకింకిణులకౌముదిరాగనివాసయోగ్యమై
యమలినమైస్వదేహమువిశేషవిలాసముసర్వమంగళా 37

ఉ. నీపదచిహ్నరాజములునీరజజాతులలాంఛనంబులై
తాపితరత్నభర్మమయిదాపరికంబదిలేకభక్తులన్
యాపదలందునాదుకొనిహ-యినొసంగునురాజశేఖరీ
తాపసులెల్లగాంతురుసుధారసధామముసర్వమంగళా 38

ఉ. వేడుటనాకువేడుకగు వేడుకదీర్చుటనీదుకార్యమౌ
యాడుటనీకువేడుకగునర్భకులైతిమితల్లిమమ్మకా
పాడుటనీదుధర్మమగు భారమునొబ్బతుకెంతకాలమో
యోడుటనాకుకష్టమగునోజననీకనసర్వమంగళా 39

ఉ. భూతములైదుగూడిపరిపోషణచేయుపిపీలికాదులన్
భూతపతిన్దలచినసుబుద్ధివిశేషముచేతనయ్యెనో
పూతచరిత్రనీదుతలపున్గలయూహలెకార్యరూపమౌ
దాతవౌ!యర్ధనారివౌ! విధాతరాతవౌ!సర్వమంగళా 40

ఉ. త్రాతవునైజగపతికిదాతవునైయలవర్ణదాతవై
భూతపతైక్యవైభవ విభూతివైవ్రణవైద్యదాతవై
మాతవునైవిధాతృకరమాతృకవైతలరాతమార్తువే
భూతపతేచ్ఛవైసకలపోషణకర్తగ సర్వమంగళా 41

ఉ. నీవుచరించుతావులుపునీతములైరసపూరితమ్ములై
భావజమిత్రునాత్మగతభావములైవరవేదతావులై
భావిజనాళిజీవనముభాసురమైఫలవంతమౌ రసా
ప్లావితమైశివాంశములలాంఛనమైచనుసర్వమంగళా 42

చ. వలచితినీపదంబులనువాంఛలుతీరగసౌఖ్యదాయినీ
తలచినకోర్కెతీర్తువుసుధారసపోషిణిధీరధీమతీ
పిలిచితినోకృపామహితపిల్చికకావగరాదెపేర్మితో
కొలిచిన నిన్నెకొల్వవలెకోమలభావినిసర్వమంగళా 43

ఉ. ఆకలిచేతబాధపడునాడలసొమ్ములులేవుతిండికిన్
యాకలియుండిసొమ్ములునుయన్నియుయున్నవియాదినంబున
న్నాకలియున్నయిష్టమగునన్నియుతిందుమనన్నకూడదంటిరే
నీకదయున్నరోగమదినీల్గునిజంబిది సర్వమంగళా 44

ఉ. జేతవునీవెజోకయినజేతవునీవెపరేతనాథధీ
దాతవునీవెదీనపరతంత్రవునీవెవిధాతనేతవీ
వేతొలిశక్తివీవెహరివిజ్ఞతవీవెపరాత్పరేశ్వరీ
మాతవునీవెశారద రమా యుమనీవెగ సర్వమంగళా 45

ఉ. దీప్తివినీవెయాత్రిదివదీప్తివినీవెసురాప్తివినీవెమా
తృప్తివినీవెయజ్ఞపరి తృప్తమునీవెతపోధనాప్తియౌ
ప్రాప్తివినీవెజీవపరిపాలినివీవెసురారిహర్తవౌ
సుప్తివినీవెజీవకళశోభలునీవెగ సర్వమంగళా 46

ఉ. దేహముమీదపేక్షతన దీనుడనైతినినిన్నినాళ్ళు నా
మోహమునీపదాబ్జములుముట్టగనాశనమయ్యెబాలుడన్
యూహలుసేయజాలకడునోరిమిజూపగజాలనీశ్వరీ
దాహమునార్పినీదరికిదారినిజూపుముసర్వమంగళా 47

ఉ. శాసనమిచ్చినావుననుశాంతముగానిటనుండమన్చు శా
బాసనమార్గగామియయిబాగుగయత్నముజేసినాను నీ
దాసుని యాహితాగ్నినివితాకుని భక్త్యనురక్తునిన్వ్యమా
న్యాసముచేతనాదుకొనిన్యాయముసేయుముసర్వమంగళా 48

ఉ. నాటకరంగమైనమహి నాకొకపాత్రనొసంగినావుయీ
మాటలునేర్చినట్టిజనమాయలమున్గితి నిన్నుమర్చితిన్
నీటనుబుగ్గగాబ్రతుకనేర్చితినీపదసేవమాననో
పాటలవర్ణరాగపదపంకజపావని సర్వమంగళా 49

ఉ. ఇక్షురసంబువోలె పువుతేనియవోలెసుధారసాంబువో
లీక్షితిపైసురాదులకుయెప్డులభించనిమార్గమందున
న్నక్షరహీనునల్పునగునాకురసాయనమోలెనిచ్చితో
లక్షణమైన విద్య నిటలాక్షుని రక్షతొ సర్వమంగళా 50

ఉ. నీదయకైసదాయిలనునిష్టగనిష్టిని చేయుచుంటి నీ
పాదములేమదిన్దలచిపాపపుకర్మలుబాపుమంటి నీ
ణీయరయతేయమలయాశయమార్గముజేయుమంటినో
హ్లాదినిహల్లికాకలితహరిహరాశ్రయ సర్వమంగళా 51

ఉ. మానసవీణతంతులనుమౌనవిధానతతాకనా
గానసువర్ణమాలలవికంఠమునందుసుకంపనంబులై
సోనలుజాలురనిలసుందరభావనదీప్తితోడతన్
కానగజేసినీపదముకామ్యముతీరగ సర్వమంగళా 52

ఉ. ఎందరుతల్లిదండ్రులొకొయీజననాంతరయోగమిథ్యతన్
యందరునేదుయేరి?కనగానిలదేహముతోనెబంధమౌ
యందమునాస్తిపాస్తులునుయన్నియుశాశ్వతనొందునేలనీ
ముందరనిల్చుభాగ్యమనుమోక్షమునీయుము సర్వమంగళా 53

ఉ.నామదినీదుపాదములనాన్కొనియుండెడిభాగ్యమిమ్మునా
క్షేమమునీదుబాధ్యతసుకేశినికైకొనునాదుపూజలన్
నీమముతప్పకుండనినునిష్ఠతొగొల్తునునిత్యనూతనీ
యేమనిదల్తువోమరికవీరభిమానిని సర్వమంగళా 54

ఉ. నీకరకంకణాభరణనిక్వణశబ్దవిలాసలాస్యముల్
కోకిలగానమైవినగకోటిలతాతరుశాఖలన్నియున్
శోకముమానిపల్లవితశోభలుచిందెవనాంతరాళిలో
నాకముమించిపోయెధరణాణ్యతనందున సర్వమంగళా 55

ఉ. ఆసుకవిత్వధారగలయష్టవధానినిగానువాక్ప్రభా
భాసురవైభవోన్నతసుభావసువర్ణశతావధానిగా
నేసతతమ్మునీపదమునేమదినిల్పితిముక్తివేడితిన్
యీసుమహేశురాణిపరమేశ హృదాలయ సర్వమంగళా 56

ఉ. రాజులుభోగభాగ్యులతిరౌద్రులుశాంతులుసత్యసంధులున్
యాజకులాగ్రవర్ణులునయష్టదరిద్రులువీరశేఖరుల్
యీజనమాన్యులాదిబనీయులుచేరునుకాటికెప్పుడున్
యోజననీయిదేమియనియోచన చేయరుసర్వమంగళా 57

చ. అలికులమాలికాకలితబాసురవేణిసువాణిమర్మిణీ
కలలవి వృద్ధిచెందెనుసకాలముదాటిబుతుల్పదా యథా
ఫలములనిచ్చుచుండెవిధిపాలన మానవమేధమించెనే
విలువలుతగ్గిహేళనయెవేదము కానవె సర్వమంగళా 58

ఉ. ఆకలినిద్రమైధునముసాజగుణంబులుజీవకోటికిన్
పోకడలెన్నియున్ననవిపోవునుగాలికివీటిముందరన్
నేకనరాజరాజులునునీతలుపల్కెడివారలందరున్
వేకనలేరు వీటినిక విశ్వమునందునసర్వమంగళా 59

ఉ. మానవజీవితంబునొకమాయలమందిరవాసభూమికొ
దీనతనూవిలాసమునధీరతబూనుచుమాయలోదిగీ
కాననమందుదారికనుగానకయుంటినిలక్ష్యమార్గము
న్నానతినీయవేజననియర్థవిధాయిని సర్వమంగళా 60

ఉ. రామునికీవుసీతబలరామునిరేవతికృష్ణురుక్మిణీ
భీమునియాజ్ఞసేనిగకపీశునితారవశిష్టునరుంధతీ
కామునికిన్రతీసతినగస్త్యునిభార్యగులోపముద్రయా
సుమిత్రపట్టికూర్మిళనుసౌఖ్యతనిచ్చితెసర్వమంగళా 61

ఉ. రాముకుసీతనీయనిచొరామచరిత్రయెలేదుతల్లియా
భీముకుయాజ్ఞసేనికనిపించకపోయినభారతమ్మెలే
దేమియుకృష్ణరుక్మిణులతీరుకిభాగవతమ్మునిల్చెనే
స్వామినివీవుకూర్చెదవుచక్కనిరీతుల సర్వమంగళా 62

చ. సకలమునీదుసృష్టియగుసాక్షమునీవయికర్తవీవెయౌ
దు కులములందుశక్తివయి దూర్తులశిక్షలువేసెదీవు స
ర్వకళలునీదుకల్పితవిరాజవిశేషమునౌనువిశ్వమం
దు కనగనంతచిత్రమగు దుష్టవిభంజనిసర్వమంగళా 63

ఉ. వానరసైన్యమంతయునువాయుసుపుత్రుడుయున్నగానియా
వానరపెద్దయున్ననునవారణరావణునుద్ధమునందుగెల్చుటల్
కానగ రామశక్తికది కష్టము సీతయెలేకయున్నయా
వానరవీరులేడరఘునాయకుడెక్కడ సర్వమంగళా 64

ఉ. రాముడునిన్నుగొల్చితనరామనితేకువ దెచ్చెలంకను
న్నామహితాత్మసీతనల నాడటపాండవశక్తికృష్ణయై
భీమునిరెచ్చగొట్టియలభీకరయుద్ధమునందుగెల్వగన్
నీమహిమేకదాసకలనిర్జరసేవిత సర్వమంగళా 65

చ. సకలచరాచరమ్మునసాధ్యవిశేషువిద్యలున్నవె
న్నొకననవిద్యమూలమునవొక్కటిగూడనుకానమేమియున్
నికరముగానుగొల్వగనునిక్కముతెల్యును రాక్షసాంతకీ
సకలమునీవె గొల్తునికసత్త్వమునిమ్మని సర్వమంగళా 66

ఉ. రమ్యమునీదుకథాసుధదిరాజవిరాజసురాజరాజతన్
కామ్యమునిత్తువెప్పుడునుకామితకార్యముతీర్చుచున్
సౌమ్యసుహ-సవికాసమునసౌఖ్యమునిచ్చుచుసంపదిచ్చుచున్
సామ్యములేదునీకిటనుశాంతినియిమ్మికసర్వమంగళా 67

ఉ. వర్ణనచేయలేనునినువర్ధిలచేతువుసర్వవిద్యలన్
నిర్ణయమీవెచేయుదువునిర్జరకార్యములన్నివేళలా
కర్ణితశబ్దజాలమునకాదరువీవయియాజ్ఞలిత్తువో
పర్ణముతోడవృక్షతతిపర్వగజేతువుసర్వమంగళా 68

ఉ. మంగళమౌనునిన్తలువమంజులభాషిణిమానినీ సదా
కంగిసయందుగెల్వగనుకానరుయెవ్వరునీదుముందటన్
భంగములేదునీపనులభాగ్యమునీయవెభవ్యమానసా
శృంగనివాసినీసకల శృంఖలమోచని సర్వమంగళా 69

చ.గణపతిషణ్ముఖుల్సరిగగారముచేతువుకంటికింపుగా
గణములపెద్దజేసితివిగణ్పతినిచ్చలుసేనకుపెద్దషణ్ముఖున్
రణమునవీరిముందరనురాగలవారలుయెక్కడుందురో
యణకువతోడమొక్కెదయంబికకావవె సర్వమంగళా 70

ఉ.లాసమునీదుసృష్టియనిలక్షణకారులుజెప్పవింటి నీ
హ-సముహ-యిగూర్చుమది హర్షిణిహ-రిణిహ-ర్షదాయినీ
వాసములెన్నియున్ననునివాసమునీదరియుంటసేమమౌ
నీసములైనవారు కననేనిట సత్యము సర్వమంగళా 71

ఉ.ముందుగనిన్నుగొల్తుమునుముందుగదల్తునునీసుతున్సదా ఉ
నందవిహ-రినాట్యనటనాయుతనాయకనాట్యమానసీ
సుందరదేహునీశు తనుసౌఖ్యవిహ-రిణిహర్షదాయి నీ
యెందరుయున్ననిన్విడువ డెందమునందున సర్వమంగళా 72

ఉ. లుప్తమునయ్యెనమ్మమరిలుబ్ధునిగానిటయుంటచేతసం
తప్తమునైమనంబునికధార్మికమార్గముపట్టెపూర్వమా
లుప్తమునైనసంపదలు లౌక్యతనియ్యవె విద్యనిచ్చి నా
కాప్తులునిన్నుమించెవరు?కామితదాయిని సర్వమంగళా 73

చ. గుణములు యెన్ని యున్నవవి గుప్తము! సద్గుణమొక్కటేసదా
రణమునగెల్చునెప్పుడును రక్షణ నీయుచు విజ్ఞతిచ్చు నా
గుణమదినీదు సన్నిధిని కోరిన నిత్యము నిర్మలత్వమౌ
గుణనిధివీవు కావునని కోర్కెలు తీర్తువు సర్వమంగళా 74

ఉ. విద్యలుయెన్నొయున్నవిలవిద్యతతొల్గినవిజ్ఞతొచ్చుస
ద్విద్యదినేర్వవచ్చుపలువిద్యలుకానగవచ్చుయుక్తితో
విద్యనునేర్పవచ్చుమరివిల్వనుపొందగవచ్చుశక్తులో
సద్యపుతెల్విపవచ్చుమదిశాంతమువచ్చును సర్వమంగళా 75

చ. శ్వసనముయున్నకాలమునసంసృతిదాటగచేయుయత్నమే
రసనమునాపుశక్త్యగునురాక్షసబుద్ధ్యదిమారి సిద్ధులౌ
విసుగదిపోవువిస్మయముపీడునువీర్యముకల్గునెప్పుడున్
అసలిదినీదుయాజ్ఞలచెయర్హతనొందెద సర్వమంగళా 76

ఉ. నాకముకోరనమ్మనినునాహృది నిల్పెద నిత్యసేవకై
నీకడయున్నచాలునదినిర్జరభూమినిమించునెంతయో
నాకడయేమిలేదుమదినమ్మికకంటెనుశక్తిలేదికన్
భీకరసంసృతిన్గడిపి భిక్షదిపెట్టుము సర్వమంగళా 77

ఉ. ధర్మముతప్పనమ్మ కులధర్మపు నిష్టనుపీడనమ్మ నా
ధర్మముతెల్పుమమ్మనిను ధార్మిక శక్త్యని తల్చితమ్మ యే
మర్మముతెల్యనమ్మమదిమార్గముచూపుచునడ్పుమమ్మన
న్నిర్మలుని జేసినిల్పుమిటనిత్యసుహ-సిని సర్వమంగళా 78

చ. శశిధరునర్ధభాగమగుశాంతిమతీవని తెల్సితేను యా
పశుపతిభావమీవనుచుబాగుగవింటినిభవ్యమానసా
అశనమునీయనీవెతగుయర్థవిధాయినియార్షవిజ్ఞదా
ఉశననిశిష్యసంతతినియూర్జితనణ్చితె సర్వమంగళా 79

ఉ. రమ్యమునీకథామృతమురంజిలజేయునుమానసంబులన్
కామ్యముతీర్చునెప్డుపలుకార్యములందునయోచనిచ్చునీ
స్వామ్యమునందునిల్పునికసొంతముసఖ్యత c సత్యనిష్టతో
యామ్యములెన్నియైననికనణ్గునునీదరి సర్వమంగళా 80

చ. మణిమయహ-రభూషితవిమానవిహ-రవికాసవీరులౌ
ఫణిమణిభూషితాంగులగుపావనపాత్రులునీదుచూపుకై
గణములపాలికెళ్ళితమగమ్యముచూపమనడ్గుచుందు్రనా
గుణమదినీకుతెల్పుగదకోమలభావిని సర్వమంగళా 81

చ. కృతమదియెట్లుయున్నదనొకింతయునెర్గనునిన్నువిడ్వనే
సతతమునిన్నుదల్తునిటసంపదనీయుముసంతుకిప్పుడు
న్వితరణచేయగల్గుటకువీలగునట్లుగవీధి cగట్టగ
న్నితరులనేమియడ్గనిట నీదయ ఙూపుముసర్వమంగళా 82

చ. తరణమునీవసంసృతినిదాటగజన్మలుయెత్తకుండనీ
దరినటయుండనీయుటకుదారిని చూపుము దక్షపుత్రికా
మరిమరి చెప్పుచుంటిననిమానసమందున కోపగించకే
హరహృదయా!యజా!యరివిమర్ధవిహ-రిణి సర్వమంగళా 83

ఉ. మీనముసంతునేలపసిమీనులరక్షణకల్గజేయునో
మీనవిలోకితాక్షివయిమిత్తినిదూరమునుంచుదెప్డుయో
మానభిమానమానములమత్సరమెర్గుదుమానినీమణీ
కానగనీవలెన్కనెడి కాపరి యెవ్వరె సర్వమంగళా 84

ఉ. కృత్యములెన్నియున్నవవికేవలుడెర్గునునీవెరుంగుదే
సత్యపదార్థవిజ్ఞతలుసాధనసంపదనీదిగాన నో
నిత్యవిధర్ధవిద్యలవి నీకడయున్నవిగానయెర్గుదో
మృత్యువునెప్డునాపగలమేయపుశక్తివి సర్వమంగళా 85

చ. తిరముగనెంచిజూడగనుతీర్థముతిర్గుటయెందుకమ్మనీ
దరినటయున్నచాలునని తల్వరుతల్చినయిన్నితిర్గనే
మరిమరిమున్గుతాముసరిమార్గముకానకమోహసంద్రమున్
స్థిరమతికల్గ నిన్నెరుగుసిద్ధినిపొదును సర్వమంగళా 86

చ. తనువుకృశింపజేయుచిటతాపసియైబహుమార్గగాములై
యనిశముహోమదానములయజ్ఞములన్చునుసప్తసంతతుల్
ఘనముగనిర్వహించుటయుకామ్యముతీరుటకోసమౌనుగా
మనమునకోర్కెలున్నపుడుమాయదితొల్గునె సర్వమంగళా 87

ఉ. వేనినిగాంచమోహమదివెంటనెతొల్గునుమోక్షమార్గమౌ
కాననమందుమార్గమదికానగవచ్చునుయాశనాశమౌ
మానసరాజ్యమందునికమంజులభావనకల్గునెప్పుడు
న్వానినినీపదంబులుగనామనమెర్గెను సర్వమంగళా 88

ఉ. పూజలుయెన్నిజేసిననుపుణ్యమువచ్చునొరాదొతెల్యదే
సాజమెమానవుల్కొటులసాధనయౌనదిభుక్తిచాలునే
రాజులుయైనగానికవిరాజులుయైననుగాన్విరాగులై
నీజపభావమెర్గవలెనిక్కముతెల్వగ సర్వమంగళా 89

ఉ. భాషలుయెన్నియున్నవలభాషణభావములెన్నియన్నియా
భాషలభూములందుపశుపక్షులబాసలభావజాలమున్
రోషపువేషబాషలనురోదనవేదనసాధనాంశముల్
పోషణకర్తవీవగుట ఁపూర్తిగనెర్గుదు సర్వమంగళా 90

ఉ. సర్వమునీవయన్చునికసొంతమునమ్మచునున్నమాకుయే
గర్వములేదుయీబ్రతుకు ఁకష్టములెందుకుకల్గజేతువో
పర్వత రాజపుత్రి పలుబాధలు పెట్టెదవేలనమ్మ నా
సర్వమునీదుముందటనుశాంతముగుంచితి సర్వమంగళా 91

ఉ. పూర్వపుజన్మజన్మలలొపుణ్యవివేకతవల్లకల్గెనీ
పర్వతరాజపుత్రిపదపంకజసేవలుచేయుభాగ్యము
న్మర్వకయుంటినేనికరమానుషభావమునందునిచ్చట
న్సర్వవిశేషకార్యములసఖ్యతనొందుచు సర్వమంగళా 92

చ. ముదుసలియైనగానిమరిమూర్ఖుడుయైననుమూకయైనగా
ని ధనములేకపోని బహునీరసుడైననుగాని ముగ్ధుడై
పదములురాకపోని పలుభాషలమాటలురాకపోని యే
విధిగనుయున్న నీకృపతొ విల్వలుపెర్గును సర్వమంగళా 93

చ. అరమరలేకగొల్వనిను వారలనెప్పుడునాదుకొన్చుయే
కరువదిలేకచేతువలకామ్యమునిత్తువుశక్తినిచ్చుచున్
స్థిరమగుసంపదిచ్చిపలుసిద్ధులనీయుచునిల్వుదెప్పుడు
న్పురహరముగ్ధమానిసివిపుణ్యవిశేషివి సర్వమంగళా 94

చ. సకలచరాచరమ్ములవిసాంతముకల్పనజేతులీలగన్
నికరములేదుదేనికిని నీసృజనందువికల్పకల్పనల్
సకలముయున్నవంతటనుశాశ్వతమేదియులేదుయెందుకో
నికమది! నీకెతెల్యునది నింతయుచిక్కదు  సర్వమంగళా  95

చ. మనముననూహలెన్నొయవి మాయలుచేయును మార్గవిఘ్నముల్
ఘనముగ గల్గచేయునల కాయముదానికి దాసియైచనున్
మనసునుకట్టివేయగను మార్గము చూపుచు నీదుదర్శన
మ్మునుకలగించి కావుమిక మాన్యతగల్గగ   సర్వమంగళా  96

ఉ. ఏనిటలాక్షవీక్షణలనీల్గినమన్మధుజీవమొందె నీ
మానితవీక్షరక్షనయి మంజులభాషిణి మందహ-సినీ
యానిటలాక్షవీక్షలవి యక్షయభిక్షయి లక్ష్యమార్గమున్
గానగ నానతిమ్మనుచు గాంక్షతొ వేడితి సర్వమంగళా  97

ఉ. కాలమదాగదెప్పుడునుకారణముండనిలేకపోనియా
కాలమునాపుశక్తెవరుకాలుని నాపెద రెవ్వరెంచగన్
మూలమునీదుశక్తియని మోహమువిడ్చిననెర్గనంతయా
కాలముయాగుటేలని కాంచగనేరరు  సర్వమంగళా  98

ఉ. నేననినాదనంచునిటనిక్కుచునుందురునీతిమాలుచున్
కానగనేదిశాశ్వతము కర్మమునొక్కటెవెంటవచ్చునే
మానవులెంచరీవిధిని మాన్యములన్నియునుండునిచ్చటన్
మాని యమానుషుండవని మార్పులుయుండవు సర్వమంగళా  99

ఉ. సంపదసంతుసంపదలసాధనలన్నియుసొంతమిచ్చటే
పంపుదమన్నలేదుదరి పారముముట్టగకానరాదు నీ
పంపునతెల్విగల్గనది పాత్రతకల్గుననెంచెదమ్మ నీ
వింపుగయాత్మదెల్పెదని నిచ్చతొయుంటిని సర్వమంగళా 100

ఉ. కర్మలుచేయకుండనిలకాలము గడ్పదునింతయేని యా
కర్మలుచేయకల్గుపలు కామ్యములెన్నియొలెక్కలేదుయా
మర్మమునీవెయెర్గుదువు మాకిదియర్థము కాదుతల్లియో
నిర్మలమానసా నిరతి, నిశ్చల తిమ్మిక సర్వమంగళా 101

చ. ధనమదియిచ్చుదండిదగుధైర్యము,దర్పముదాహమెంతయో
ఘనమగుగౌరవమ్మునిక,గర్వము,కల్పనశక్తియుక్తులన్
మనమునసేనునాదిదను మత్తునుయిచ్చునుమత్సరమ్ముతో
కన! నినుచేరుమార్గమది కానగ చేయుము సర్వమంగళా 102

ఉ. ~~ఈ~~తనువిచ్చు వారలగుపెద్దల గౌరవమేమొగాని యా
యాతనలేల బాలిశుల యాజ్ఞలొయుండుటయేలనమ్మనా
త్రాతవుదాతవీవెగద ధార్మికమార్గముజూపినడ్పవే
మాత!పవిత్రతిస్తుమది మాయనుమాన్పుచు సర్వమంగళా 103

ఉ. తల్లదిచిన్ననాడెచనె తండ్రిమరేమియుపట్టనట్లుయుం
డెల్లెడ గానకుండెనలడొక్కలొశుద్ధదిలేకచిక్కితిన్
తల్లడమందితిన్నవితి తల్లదికల్పన చేయుబాధలన్
మెల్లగనెట్లొనోర్చితిని మిన్నకయుంటివి సర్వమంగళా 104

ఉ. కామముచేతకల్గెకదకాంచనసంకెలలన్నియిచ్చటన్
కామునినణ్చువానిసగకాయముపొందితివీవుశక్తివై
కామితకార్యమంతయునుకానగచేతువునిన్నునమ్మగన్
కామవికారమణ్గెడుసుకార్యముజూపుము సర్వమంగళా 105

ఉ. గర్వముదించికంటిపొడకడ్డముదీయుచుధర్మమార్గమున్
నేర్వగనిమ్ముమోహమలనీల్గగ జేయుచుమోక్షగామిగా
సర్వముగాంచనిమ్ముమరిసారససాహితశాంతినిమ్ము నే
మర్వని తెల్వినిమ్మునికమర్మముతెల్పుచు సర్వమంగళా 106

ఉ. శర్వునిపాణిబట్టిననిశంబునువీడకయుండుశక్తివై
సర్వచరాచరమ్ములనుచక్కగనడ్వగచూచుచుండియీ
సర్వ జగత్తు నీదు కనుసన్నల నాజ్ఞల నిల్పినావు నా
సర్వమునీవెయంటిననుశక్తుని జేయుము సర్వమంగళా 107

ఉ. శర్మనుపుణ్యకర్ముడినిశాస్త్రవిశారధుజేయశాశనీ
ధార్మికమార్గగామిగనుదాతగధారుణినున్నకాలమున్
నిర్మలమానసమ్మవగనిత్యమునిశ్చలబుద్ధినిమ్ముయీ
మార్మికవిద్యనిమ్ముమహిమాన్వితమానసి సర్వమంగళా 108

ఇది
కౌండిన్యసగోత్రోద్భవుండగు ములుగునాగలింగారాధ్య ప్రపౌత్రుండును విశ్వనాధారాధ్య పౌత్రుండును దుర్గాప్రసాదారాధ్యపుత్రుండునుహనుమకొండ వాస్తవ్యుండును యగు ములుగు విశ్వనాథారాధ్య విరచిత సర్వమంగళా నామ మకుట సహిత అష్టోత్తరశత పద్య సుమంబులు శ్రీలలితాత్రిపురసుందరీదేవిచరణారవిందములకు సమర్పితము
ఇతిశం